# కావ్యకన్య

గ్రంథకర్త

"కవితాభూషణ" "ప్రజాకవి"

ఎం. పి. జాన్ కవి

# కావ్య కన్య

ముద్రణ :
సెప్టెంబరు 1988

వెల : రు. 5-00



ప్రతులు - 1000

గ్రంథములు దొరుకుచోటు :
శ్రీ ఎం. పి. జాన్‌కవి
పాలబజారు, బాప్టిస్టుపాలెం
వి జ య వా డ-16

ముద్రణ :
శ్రీ అన్నపూర్ణ ప్రింటింగ్ ప్రెస్
విజయవాడ-2.

# విషయసూచిక

శ్రీ కరమౌచు సజ్జనవ
శీకరమౌచు కళావిలాసశో
భాకరమౌచు, సంతతశు
భాకరమౌచు ననూహ్యభావర
త్నాకరమౌచు, సత్యసుగు
ణాకరమౌచు, వెలుంగు లీను ప
ద్మాకరమౌచు, ధాత్రికరు
ణాకరమై విలసిల్లు కావ్యమున్ ।

# అంకితము

## మా: దిగొండ ఇందిరా ఈశ్వరచరణులకు

ముదిగొండ వంశవార్నిధి
నుదయించిన పూర్ణ హిమమయూఖుండగునా
సదయుండీశ్వర చరణుడు
ముదమున కృతి భర్తయై ప్రమోదము కూర్చెన్!

సరసుడు, సాధు వర్తనుడు సత్కవితా వ్యవసాయమందు సు
స్థిరుడయి కీర్తి సంపదల శేషముగా గడియించుకొన్నవా
డురుకరుణా యుతుండు సుగుణోజ్జ్వలు డంచిత ప్రేమమూర్తి ఈ
శ్వర చరణుండు మెచ్చగ ప్రశస్తి వహించుత నాదు కావ్యమున్

ఎవ్వాని తాత సాహిత్యలోకమ్ము పా
లించిన ఉచ్చ్యయలింగశాస్త్రి
ఎవ్వాని తండ్రి మహేశ్వరార్చన కళా
చతురుడౌ నందికేశ్వర చరణుడు,
ఎవ్వాని మాతులుండిద్ధ చారిత్రుండు
రాజలింగా రాధ్య రమ్య గుణుడు
ఎవ్వాని శ్వశురుడు హితమిత వర్తన
పాపయలింగాఖ్య వరలుచుండు,

దేవియై నిల్చి తనయులు దీర్చి తనరు
సతివ ఇందిర యెవని యర్ధాంగ లక్ష్మి
అట్టి ఈశ్వర చరణు ప్రేమాంకమందు
ఘనత గాంచును గాకనా కావ్యకన్య!

ఎం. పి. జానుకవి

# సంపాదకీయం

శ్రీ మందిగొండ ఈశ్వరచరణ్

ప్రధాన కార్యదర్శి

సాహితీ వికాసమండలి, సిద్దిపేట.

అభిమానానికి ఎల్లలు-ఆత్మీయతకు కల్లలు వుండవంటారు. ఇందుకు సాక్ష్యం మా మిత్రుడు శ్రీ ఎం.పి. జానుకవి.

1985లో సాహితీవికాస మండలి ఏర్పాటు చేసిన మొదటి వేముగంటి సాహితీపురస్కారం తీసుకోవడానికి సిద్దిపేట రావడంతో మా పరిచయం ప్రారంభమైంది. ఉత్తరోత్తరా ఉత్తరాలద్వారా పెరిగి - విరిసి ఈ నాటికి తీరని తీయని బంధంగా - అనుబంధంగా ముళ్ళు వేసుకున్నది.

"భావస్థిరాణి - జననాంతర సౌహృదాని" నా "కావ్యకన్య" నిన్ను వరించింది" అన్న సుహృత్ లేఖ చదివిన నా మనసులో తళుక్కున మెరిసిన కాళిదాసుని కావ్యపది. ఆ క్షణంలో ఆశ్చర్యం కలిగింది- ఆనందం కలిగింది- కలయో, వైష్ణవమాయయో అన్న సందేహం కలిగింది. మరు క్షణంలో మిత్రుడి ప్రేమానురాగాలలో మురిసి మురిసి మూగపోయింది. కావ్యాలు- అంకితాలు- ఇచ్చుకోవడాలు- పుచ్చుకోవడాలు- ఇలాంటి సందర్భాలలో అర్హతకన్న- అభిమానాలు ముఖ్యభూమిక వహిస్తాయని తెలుసు కాబట్టి వెంటనే ఈ "కావ్యకన్య"ను నెత్తి కెత్తించుకోవడానికి సిద్ధపడ్డాను.

ఇందుకు ప్రతిగా ఏమివ్వాలి? అసలు ఏమివ్వగలను? ఒక్క——ఒక్కటంటే ఒక్కటి- నమస్కారం తప్ప! అవును! వెన్నెలలు కురిసి-చలువ పందిళ్ళువేసి, ఆనందాన్ని పంచుతున్న ఆ చంద్రుడికి ఏమిస్తున్నాము? ఓ నూలుపోగు! ఇదీ అంతే....!

హితమున హితముల దెలిపి వెతలమాన్పి
కులమతమ్ముల జాడ్యపు కుళ్ళుడుల్చి
సత్యశివసుందరమ్ముల సరణి జూపి
రీతి, వృత్తి గుణంబుల నీతులొప్ప
కువల యానందమును గూర్చు కూర్మితనయ
'కావ్యకన్య' నిచ్చితి జానుకవి వరేణ్య
మనదు నెయ్యము వియ్యము మనుతనెల్ల
కాలముల- నిహ పరముల- కథలు గాగ॥

(సం) ముదిగొండ ఈశ్వరచరణ్

# కైస్తైత

## శ్రీ వేముగంటి నరసింహాచార్యులు

అధ్యక్షులు

సాహితీ వికాసమండలి- సిద్దిపేట

హృద్యంగా, నిరవద్యంగా పద్యకవిత వ్రాస్తున్న ఆధునిక కవులలో శ్రీ ఎం.పి. జానుకవి ఒకరు. వీరు ఇదివరకు 'జాతిపిత' మొదలైన పద్యకృతులు సంతరించి ఉత్తమ కవిగా పేరుగాంచారు. వీరి "జాతిపిత" కావ్యానికి సిద్ధిపేట వేముగంటి సాహితీ పురస్కారం లభించింది. సరళ సుందరమైన శైలి ధారాశుద్ధి, జానుకవిగారి కవితకు జీవగఱ్ఱలు. ఎంత గొప్ప భావాన్నైనా తేటగా, సూటిగా మధురంగా చెప్పగల నేర్పు శ్రీజాను కవికి సహజంగా అబ్బిన లక్షణం। ప్రతిభా వ్యుత్పత్త్యభ్యాసములు సమపాళ్ళలో మేళవించుకొన్న జానుకవిగారి కవితా రచన రమ్యమై, రసవంతమై, సహృదయ హృదయాలను ఆకట్టుకొంటుంది.

శ్రీ జానుకవి ప్రస్తుతకృతి "కావ్యకన్య" ఆధునిక సామాజిక పరిస్థితులకు అనుగుణమైన లక్షణాలను వివరిస్తున్న విలక్షణమైన లక్షణ కావ్యం. ఈ కావ్యం నిర్వచనం ఆనందం ఉపదేశం అనే మూడు ఖండాలుగా విభజింపబడినది. మొదటి ఖండం కావ్య నిర్వచనాన్నీ, రెండుమూడు ఖండాలు కావ్య ప్రయోజనాన్నీ తెలియజేస్తున్నాయి।

మొదటి ఖండంలో కావ్య నిర్మాణాన్ని గూర్చి చక్కగా నిర్వచించడం జరిగింది. పదముల తీర్పులోనూ, భావముల తీర్పులోనూ కవిచూవదగిన నేర్పూ, ఓర్పూ తెలుపబడినవి. నన్నయాది మహాకవుల కావ్యాలను చదివి వారి పోకడలను ఆకళించుకొని కావ్యరచనకు పూనుకోవాలని ఉగ్గడించబడినది. కృతి నిర్మాణం ఎట్లా చేయాలో ఈ క్రింది పద్యాలలో కవి చూపించారు.

"వాక్యమొక్కటి సరససంపదలు కలిగి
యున్న నయ్యది కావ్యమై యొప్పుచుండు
రమ్యమగు పదములు దోషరహితమైన
నద్ది సత్కావ్యమై నిల్చున హరహాంబు: "

"పదములు దేహమై మధుర
భావము లాత్మయు నౌనటంచుకో
విదులు వచించినారు...."
"దేహమేదని యన్న దిరిసెనపుంబూవు
మిస మిసలీనెడు మృదు పదములు,
ఆత్మ యేదనన నూహ్యంబౌచు మదిలోన
వాసంబు చేసెడు భావసటిమ"

ఈ నిర్వచనాలు ప్రాచీన భారతా లంకారికులు ప్రకటించిన "వాక్యం రసాత్మకం కావ్యం" "రమణీయార్థ ప్రతిపాదక శబ్దం కావ్యం" మొదలైన సూత్రాలను జ్ఞాపకం తెస్తున్నవి.

లోకంలో కావ్యంయొక్క బాహ్య సౌందర్యానికి భళీ అనేవాళ్ళు కొందరు, అంత స్సౌందర్యానికి ఆనందించేవాళ్ళు కొందరు వుంటారు. ఈ రెండు తెగల వాళ్ళను మెప్పించడానికి కవి ప్రయత్నించాలని ఈ కృతికర్త తెలుపుతున్నారు. శబ్దార్థ సంధానం సమంగా వుండాలనేది శ్రీ జానుకవి ఆశయం. ఇదివారి కవిత అంతట కనబడుతుంది. ఇందుకు ఉదాహరణగాఈ కావ్యంలోని ఏ పద్యాన్ని పరిశీలించినా తెలుస్తుంది.

కావ్య ప్రయోజనాలలో ఆనందం, ఉపదేశం ముఖ్యమైనవిగా ఆలంకారికులు అను శాసించారు. జానుకవిగారు రెండవ ఖండంలో ఆనందాన్ని గూర్చి వివరించారు. ఆనందం కలిగించడానికి కావ్యం ఎట్లా వుండాలో ఈ ఖండంలో తెలపటం జరిగింది.

మల్లెలు పూచినట్లుగా, మీగడపైన కలకండపు పొడిచల్లి భుజించినట్లుగా, చల్లని గాలి వీచినట్లుగా, పూవులబడి నీటి బిందువులు తనరారినట్లుగా కావ్యరచన సాగినప్పుడే ఆనందం కలుగుతుంది. నెమలి నాట్యమాడినట్లుగా, చిరు తరంగాలు సేదదీరి పూవుపూవున కొకముద్దుపెట్టి, వలపులూరించు శీతల పవస వలె కావ్యకన్య హాయిని కూర్చాలని కవి ఆశయాన్ని ప్రకటిస్తున్నారు.

"బంగరుమేని తోడ తడ
బాటు తెలుంగని పల్కుతోడ స
న్మంగళ మూర్తియై నిరుప
మాన కళా నిలయంబు పోలికన్
ముంగిటిలోన నిల్చి యర
మోడ్పు కనుంగవతో రసజ్ఞులు
పొంగగ స్వాగతించు నవ
మోహిని కావ్యకళా వధూటియున్"

అంటూ కావ్యకన్య స్వరూపాన్ని సాక్షాత్కరింపజేస్తూ ఈలాంటి కావ్యమే రసజ్ఞులకు ఆనందాన్ని కలుగజేస్తుందని ఆకాంక్షను వెల్లడించారు కవి.

ప్రకృతి సౌందర్యమంతా రాశియై కావ్యకన్యగా రూపుదిద్దుకున్నప్పుడే ఆనందదాయిని అవుతుందని జానుకవిగారు నిక్కచ్చిగా వక్కాణించారు. కావ్య ప్రయోజనాలలో మరో ముఖ్యమైనది ఉపదేశం. ఈ ప్రయోజనం "ఉపదేశ"మనే మూడవదీ, చివరిదీ అయిన ఖండంలో ఉగ్గడింపబడినది.

"ఒకనాడు వేదమ తోద్ధరణమునకు
కవితా కుమారి స్వాగతము పల్కె,
ఒకనాడు పిచ్చిమ తోన్మాదమును బాప
కవితా వధూటియుకదను ద్రొక్కె,
ఒకనాడు శృంగార ముదయింపగా గోరి
నవకవితా కన్య నాట్యమాడె,
ఒకనాడు నానంద ముపదేశముల నీయ
కావ్యకన్య నిక్కముగ నిలిచె,

దేశ కాలములను దృష్టిలో నిడుకొని
కావ్యకన్య పెక్కుగతుల దనరె
నేయు గానమైన నేకాల మందైన
నదిజ "గద్దితంబు"నై వెలింగె!

ఈ పద్యం ద్వారా కవి దేశ కాలాల ననుసరించి లోకహితాన్ని చేకూర్చడానికి ప్రయత్నించాలని ఉద్బోధిస్తున్నారు.

కాలం మారిపోయినది కనుక కావ్య ప్రయోజన సూత్రాలు కూడ మారాలని కవి ఆకాంక్షిస్తున్నారు. సమత, సాధువర్తన, సత్యం, విశ్వాసం, ఆత్మగౌరవం, ఉత్సాహం మొదలైన గుణగణాలు దీపించునట్లుగా కావ్యం మానవులకు ఉత్తమమార్గం ఉపదేశించాలని పెద దారులలో ధనం సంపాదించి, పేదలను చీదరించుకొని, గర్వించువారిలో కరుణా ప్రవంతిని ప్రవహింప జేయడం, స్త్రీల మానభంగాలు, వరకట్నంవంటి దురాచారాలు నివారించడం మొదలైన విధానాలను కావ్యం ద్వారా కవులు ప్రయోజనకరంగా సాధించాలని విశదంగా తెలుపబడినది.

శ్రీ గలవారు పేదలను ఈగలుగా తీసివేయుట సాగదని కవిత భేరి మ్రోగించాలని కవి ఉద్ఘాటిస్తున్నారు. ఇంకా ఈఖండంలో కులాల పేరుతో మతాల పేరుతో సాగుతున్న దుండగాలను ఖండించే కవిత కావాలని ఉగ్గడింపబడినది.

ఈ విధంగా ఆధునిక సామాజిక ప్రయోజనాలకు అనుగుణంగా కావ్య స్వరూపాన్ని కమనీయ రీతిలో సంతరించిన జానుకవిగారిని అభినందిస్తున్నాను.

ఈ కృతిని సహృదయ సాహితీవిమర్శనా ప్రవీణులు. సాహితీ పరులందరికీ ఆత్మీయులు అయిన శ్రీ ముదిగొండ ఈశ్వర చరణ్‌గారికి అంకితం చేయడం పాలలో పంచదార కలిపినట్లుగావుంది.

# మనవి

రసజ్ఞులకు నమస్కారం:

కావ్య లక్షణాలను కావ్యంగా చెప్పడం.... ఒక విలక్షణమైన పద్ధతి. మా గురుదేవులు ఆచార్య దివాకర్ల వేంకటావధానివారు అముద్రితంగా వున్న ఈ కావ్యకన్యను చూచి ఆనాడే మెచ్చుకొన్నారు. ఆ మెప్పు దల సత్ఫలోన్ముఖమై, కావ్యకన్య ముద్రితమై సహృదయుల కరకమలాల నలంకరించే యీ శుభసమయంలో నా ఆనందానికి అవధులులేవు: ఇప్పటికి పది, పదిహేను కావ్యాలువ్రాసి, ముద్రించినా, ప్రతి కావ్యముద్రణా ఒక ప్రసవ వేదనేయైనా...., రూపురేఖలు సంతరించుకొన్న నవ్యకావ్యాన్ని చూచి, ఏదో మధురానుభూతిని పొందటం నా కలవాటై పోయింది. నాకే కాదు.... కవులందరికీ ఇదొకరకమైన పిచ్చేమో:

ఏది యేమయినా.... ఆనందం మాత్రం.... ఆనందమే కదా: ఈ శుభసమయంలో "కావ్యకన్య"ను పరిశీలించి, ముద్రణార్థం రు 500లు ఆర్థిక సహాయం చేసిన తెలుగు విశ్వవిద్యాలయం (హైదరాబాదు) వారికి కృతజ్ఞతాభివందనాలు తెలుపుకొంటున్నాను.

ఈ కావ్యంలోని పద్యాలు చాలావరకు "స్రవంతి", "ఆంధ్రజ్యోతి" (వారపత్రిక) "గాంధీక్షేత్రం" మొదలైన పత్రికలలో ప్రచురింపబడి సహృదయుల నలరించినవే. మరికొన్ని పద్యాలు నాచే ఆకాశవాణి (విజయవాడ కేంద్రం)ద్వారా గానం చేయబడినట్టివే: ఆయా పత్రికల సంపాదక మహోదయులకు, ఆకాశవాణి విజయవాడ కేంద్రం డైరెక్టరు వారికి నా కృతజ్ఞతలు తెలుపుకొంటున్నాను అడిగినంతనే ఆదరంతో "కైసేత" నొసంగిన "విద్వత్కవి" "కవిశేఖర" శ్రీమాన్ వేముగంటి నరసింహాచార్యులవారికి కృతజ్ఞతాభివందనాలు సమర్పించుకొంటున్నాను. ఆత్మీయులు, సన్మిత్రులు శ్రీ ముదిగొండ ఈశ్వరచరణ్ దంపతులకీ కావ్యాన్ని అంకితం చేయటం నా కుముదావహం: రసజ్ఞులీ కావ్యాన్ని ఆదరిస్తారని ఆశిస్తూ అంజలి ఘటిస్తూ- శలవు తీసుకుంటున్నాను.

1-9-88

ఎం. పి. జానుకవి.

# నిర్వచనము

నన్నయ్య సన్నిధి వన్నె చిన్నెలు నేర్చి
        తిక్కయ్య భావాల దీప్తినండి,
పోతన్న పదముల పూదేనియలు చింది
        శ్రీనాధు 'సీసాల'ఛే వనంది
భువన విజయరంగమున కీర్తి గడియించి
        చేమకూరను చేరి శ్లేష నేర్చి
తిరుపతి కవులలో ధీపముపేతమై
        నవయుగ కవుల మన్ననలుపొంది,

ఆంధ్ర కవి వరేణ్యుల పూజలందుకొనుచు
నిత్య నూతన భావాల నిగ్గుదేలి
తెలుగు పొలముల సతతంబు పులకరించు
తెలుగు పలుకుల వెలదిని కొలుతు నెపుడు ।

1

పుడమినున్నట్టి ధన ధాన్యములు నశించు
కనకమయ భూషణంబులు కానరావు
సప్త సంతానములలో ప్రశస్తిగాంచి
యనవరతమునిల్చు నది కావ్యమ్ము సుమ్ము ।

2

వాక్య మొక్కటి సరస సంపదలు కలిగి
యున్న నయ్యది కావ్యమై యొప్పుచుండు
రమ్యమగు పదంబులు దోష రహితమైన
నద్ది సత్కావ్యమై నిల్చు నహరహంబు ।

3

యువతి కాత్మయు దేహంబునుండు నటులె
కావ్యమున కాత్మ దేహముల్ కలవు నిజము
తనువు పదములు, భావమాత్మయును కాగ
ధ్వన్య లంకారములును సౌందర్యమొసగు ।

4

దేహమేదనియన్న దిరిశన పుంబూవు
మిస మిసలీనెడు మృదు పదములు ।
ఆత్మ యేదన ననూహ్యంబౌచు మదిలోన
వాసంబు చేసెడి భావ పటిను ।
సౌందర్య పోషక సామగ్రియే మన
కమనీయమగు నలంకారములగు ।
వలపులూరించెడు వస్తువులేవన్న
ధ్వని, రసంబును, కావ్య వస్తువులను

నిత్య సత్యమైన, నిరుపమానములైన
పదులుగొల్పు తీపి మాటల మరి
సరస హృదయములను స్పందింపగా జేయ
గలిగియుండు నవ్య కావ్య కన్య ।

5

పదములు దేహమై మధుర
భావములాత్మయు నౌనటంచుకో
విదులు వచించినారు, తను
వే పరిపూర్ణ కళా విలాస సం
పదలకు తావలంబయిన
వాస్తవ మాత్మయు నిర్మలంబుగా
హృదయములందు నిల్వగల
దెన్నటికిన్ కవితా కుమారియున్ ।

6

పదము మృదంగ శబ్దములీను, వేరొక
పదము సంగీత సుస్వరములగును
పదము కళ్యాణ శోభలు నింపు, వేరొక
పదము బీభత్సమై భయముగొల్పు ।
పదము శృంగార భావము రేపు, వేరొక
పదము వైరాగ్య భావములు నింపు ।
పదము భూలోక సంపదలిచ్చు, వేరొక
పదము స్వర్లోక సౌభాగ్య మొసగు,

పదము సజ్జనాళిని సదా పలుకరించు
పదము రసలుబ్ధులకు పరవశము కూర్చు
పదము కల్మషహారమౌను ; పదము విజయ
శ్రీలు పోలు పొందగలనవ జీవమగును ;

7

పద మొకటి పలుకరించును
పదమే తెగద్రెంచు నఖిలభవ బంధములన్
పదమే జీవ మొసంగును
పదమే యమరేంద్ర దివ్య పదవిని కూర్చున్

8

వినుట, చదువుటచే రసావేశ మొసగు
నట్టివానిని శ్రవ్య కావ్యంబులండ్రు
పాత్రధారుల యభినయ పాత్రములగు
నట్టివానిని దృశ్య కావ్యంబులండ్రు ;

9

కదళీపాకము, నారికేళమును ద్రా
క్షాపాకమందున్న మేల్
పదముల్ సొంపు ఘటింపుచుండ రసమున్
భావంబు, శ్లేషాదు ల

భ్యుదయంబౌచు, హృదంతరాళములలో
నుత్సాహ సౌందర్య సం
పదలన్నింపి వెలుంగు చుండవలె కా
వ్యం బిద్ధరామండలిన్ ।

10

పద్యం బొక్కఁడు గొప్పని,
గద్యంబే గొప్పయని యొకండన్న నేలా
పద్యమొ, గద్యమొ, గేయమొ
హృద్యంబుగనున్న నద్దియే కావ్యంబౌ ।

11

సాంప్రదాయంబైన సత్పద్యములతోడ
నలరించునొక్క కావ్యంబు మదిని
హృద్యమై, సరస సాహిత్యమై సూటిగా
గద్యంబులో సాగు కావ్యమొకటి ।
లయ బద్ధమై నవ్యలావణ్యమొలుకుచు
పదముల సాగు కావ్యంబు నొకటి ।
గేయమై గుండెలోగా యంబులను కర్ణ
పేయంబుగా వినిపించు నొకటి ।

పద్య గద్యములను, పదములు గేయంబు
లేవియైన లోకహితము కోరి
నవరసాలు కల్గి నవ్య భావనకల్గి
యున్న నద్దియే మహోన్నతంబు ॥

12

కలుగంపగల సోగకనుల నొక్కడు మెచ్చు
కమ్మని పలుకు నొక్కండు మెచ్చు ॥
దరహాసమొలుకు వదనము నొక్కడు మెచ్చు
బింబాధరము మెచ్చు ప్రీతి యొకడు ॥
తమి తీర్చగలకు చద్వయము నొక్కడు మెచ్చు
కటి సీమనొకడు నిక్కముగ మెచ్చు ॥
కలికి ముద్దుల హంసగమన మొక్కడు మెచ్చు
కులుకుటందెలు మెచ్చుకోరి యొకడు ॥

బాహ్య సౌందర్యమును మెచ్చు వాడొకండు
నాత్మ సౌందర్యములు మెచ్చి యలరునొకడు
నందఱకు నన్నియగుచు రసానుభూతి
కలుగ జేయగావలె నవ్య కావ్య కన్య ॥

13

శబ్దంబు వినినంత జలపాతములు పొంగి
    రవళించు నొక కావ్య రాజమందు,
అర్థంబు గనినంత నానంద రసలక్ష్మి
    యలరించునొక్క కావ్యంబునందు,
అరుదైన యట్టిశయ్యా విలాసము చూడ
    కల నిజమగునొక్క కావ్యమందు,
లావణ్య మొలుకు నలంకారములు చూడ
    కను వెల్గులగు నొక్క కావ్యమందు!

శబ్దముల తోడలో గొనజాలు నొకటి,
భావములతోడ సంతోష పరచు నొకటి
తళుకు బెళుకుల మదులను తనుపు నొకటి
కనులతో మాటలాడెడు కావ్య మొకటి!

14

పద గుంభనముతోడ పరవశించెడు వారి
    హృదయ నాదంబుతో నేకమగుచు,
నర్థంబు నరసి మహానంద మొందెడు
    సరసుల కానంద సరసియగుచు,
శ్లేషోక్తు లెప్పుడాశించెడు వారికి
    ప్రతి పదాద్భుతచమ త్కృతియునగుచు,
లలితంబులైన. యలంకారములు కోరు
    రసికుల కందాల రాశియగుచు,

పదము హృదయంబులను పరవశ మొనర్ప
నర్ధమానంద జలధిగా నవతరింప
అంద చందాలు కన్నుల విందుసేయ
జగములేలును కవిత నిస్సంశయముగ ;

15

కరుణ రసంబులో కడిగిన పదములు
కరుణను పుట్టింప గలిగియుండు ;
శృంగార రసముతో చెలువొందు పదములు
శృంగార భావంబు సృష్టిచేయు,
వీర విక్రమమున విలసిల్లు పదములు
మదుల వీరావేశ మొదవ జేయు,
హాస్యరసంబున కనుకూలమగు పదం
బులు చిత్తములయందు ముదము నింపు,

భయము గొల్పగ కొన్ని, బీభత్సమునకు
కొన్ని, శాంతాద్భుతములకు కొన్ని రౌద్ర
మునకు నిలయంబులగు పదంబులను కల్గి
నవరసానందమగు కావ్యమవనిలోన ;

16

భీమసేనుని వీర విక్రమంబును చూడ
హృదయాలను త్తేజ మొదవుచుండు,
రాధికా ప్రణయ సామ్రాజ్యంబు నీక్షింప
శృంగార రసగంగ చెంగలించు,
ఉత్తరు ప్రజ్ఞలనూహించి నంతనే
హాస్యమెల్లెడల నాట్యంబు సేయు,
ఘాపుత్రిలంకలో పొగలుట కనుగొన్న
నెమ్మది శోకంబు నిండిపొరలు,

వీర రసమైనగాని శృంగార రసమె
యైన, హాస్యంబు శోకంబులైనగాని
రసిక హృదయాల సత్కళా రాజ్య వైభ
వములు చిత్రించుచుండు కావ్యంబు సతము।

17

పలుకు వెలంది సుస్వరములు పలికించు
వీణాని నాదంబు విశదపరచి,
కరకంకణముల నిక్వణమట్లు నినదించు
ప్రతి పదార్థములందు పరవశించి,
కాలి యందియల ఘల్ ఘల లట్లు రవళించు
మృదు పదంబులతోన నొదిగి యొదిగి,
హృదయంగమై మహోభ్యుదయమై వెలుగు ర
సానందమున తదాత్మ్యంబునంది

చదువరుల గుండె లలరించి ముదము కూర్చి
సర్వలోక కళ్యాణదీక్ష నువహించి
మనుట నేర్పించి, సర్వ సంపదలు కూర్చ
గలిగి విలసిల్లవలె నవ్య కావ్య కన్య ।

18

ఫాలంబు క్రొన్నెల వంకయౌనందుచే
నమృతాభిషేకమే యగుచునుండు ।
కనుదోయి వికసించు కలువలు కావున
నమృతాంశుకరముల నలరుచుండు ।
పలుకులలో తేనెలొలుకుచుండుట చేత
నమృతంబున ధరాన నమరియుండు ।
చనుదోయిలో గాన సాహిత్యములుగాన
ముదమార మధువులుపొంగుచుండు ।

మహిని సత్కావ్యమాపాద మస్తకంబు
రాగమయమౌచు నవసుధా రసములొల్కు
రసము జీవితానంద సర్వస్వమగును
రసము శాశ్వతమగు పరబ్రహ్మమగును ।

19

పల్లవంబులలోన ప్రతిఫలించును మధు
రాధరంబనెడు సత్యంబు దెలిసి,
ఫలములు చిలుక తేనెలలోన దేలును
మధు రోక్తులను మంచి మాట దెలిపి,
ప్రతి పుష్పగంధ వైభవముతో విలసిల్లు
తనువను సత్య వార్తలను తెలిపి,
వెలయేటి క్రొన్నురుగుల పరుగులలోన
నడకల యంద చందములు తెలిపి,

ప్రకృతిలోగలట్టి ప్రతి పదార్థము కావ్య
వస్తువేయటన్న వరుస దెలిపి
పురుష ప్రకృతిరమల పొందదే ప్రణయకా
వ్యంబులంచు దెలుపవలయు కృతులు ।

20

ప్రతిభ కలవానికే కావ్య వస్తువైన
రసమయంబౌచు నానంద మొసగుచుండు
ప్రతిభలేకున్న సత్కథా వస్తువైన
పేలవంబగుపో నిరుపేదవోలె ।

21

కనులు వెలిగించు సుమమేని కాంతితోడ
వలపులూరింపగల తీపి పలుకుతోడ
పురుషాళిని ఋజుమార్గమునకు ద్రిప్పు
తరుణిగా నుండవలె కవితా కుమారి !

22

తన సౌందర్యముచేత వాక్యముల చే
తన్ మోహమూరించి, భ
ర్తను సన్మార్గమునందు ద్రిప్పగల కాం
తన్ బోలి సత్కావ్య మి
మ్మను జాళిన్ ఋజుమార్గమందు నడిపిం
పన్, లోక కళ్యాణ దీ
క్షను బోధింపను శక్తి మంతమగు లో
క ఖ్యాతి నార్జించుచున్ !

23

ఇవతాలించిన కల్వరేకులగు నో
యీ! కావ్య కన్యా మణీ
సువిశాలంబగు కన్నుదోయి, వలపిం
చున్నిందు జాబిల్లి సం
స్తవ నీయంబగు వెండి వెల్గులను దా
త్త ప్రజ్ఞ రంజిల్ల నీ
భువి నేలంగల శక్తి రూపమగు సౌం
పుల్ చిందు సత్కావ్యమున్ ?

24

మెత్తని పదములు పూవుల
గుత్తులవలె కూర్చి సరసకోమలమును, స
ర్వోత్తమమగు భావంబులు
చిత్తంబుల నింపు కావ్య శ్రీ ముదమారన్ ।

25

పదములను పొందు పరచుట
మదిలోగల భావమందు మలచుట, ప్రేమన్
చదివిన వారల గుండెల
ముదమును నింపుట యెకృతికి ముఖ్యంబిలలో

26

మానవ జన్మ మెత్తియ స
మాన చరిత్రను సృష్టిచేసి స
మ్మానములందియుండి మణి
మాన్యము లెన్నియు కల్గియుండినన్
కానల ముక్కు మూసికొని
కాలము పుచ్చెడు వారికేనియున్
మామగ జ్ఞాన మీయగల
మంత్రము సత్కవి కావ్యమే సమా ।

27

నడచినకాల చక్రగమ
        నంబును వెన్కకు ద్రిప్పజాలు వీ
రుడు కనరాడు దానినిజ
        రూపము దెల్పెడివాడు లేడిలన్
గడచిన కాలపై భవము
        కన్నుల ముందరకట్టి పైచుచున్
నడకను తీర్చిదిద్దెడు స
        నా తన సంపద కావ్యమే సుమా!

28

ధనకనక వస్తుసంపద
లెన లేవివియైన తరుగు నిద్ధరయందున్
జనులెంతమంది చదివిన
ఘనముగ పెంపొందు కావ్యగత భావంబుల్

29

శిల విచ్ఛిన్నముకాని యంతవఱకే
        శిల్పంబు జీవించు, ని
మ్మల చిత్రంబున వన్నెలుండువఱకే
        భూమిన్వి రాజిల్లు! శ్రీ

తలలో గాయకులుండు నంతవఱకే
స్థానంబుగా నానకున్
కలకాలంబును వాక్యరూపమునన
త్కావ్యంబు జీవించెడిన్

30

శిల్పిపోగరకు వాసిని గూర్పగాజాలు
పలు భంగిమలకు జీవంబువోసి,
చిత్రలేఖ కునికుంచియకు వన్నెలుదిద్దు
పలు వర్ణములకు రూపంబునిచ్చి,
గాయకాగ్రణి "సరిగమ"ల కర్థముసెప్పు
పలు పదంబుల తేనెలొలుక జేసి,
నటనా విలాసమంతయు బోధగావించు
పలు భావములకు నిర్వచన మొసగి,

శిల్పమును, రంగురంగుల చిత్రములును
గాన కళయును నభినయ కౌశలమును
కలిసి వాగ్రూపమున నన్ని కాలములను
ధరణి వర్తిల్లు నదియ సత్కావ్యకన్య।

31

కవితయనునట్టి దినుసును కలిగియున్న
వేదియైనను కావ్యమౌ నీజగాన
కవితయను నెట్టి దినుసును కానకున్న
నేది కావ్యంబు కాదు మహీతలాన.

32

కోటి తీర్థాల యందున గ్రుంకు ఫలము
కోటి వేల్పుల నొకమారు కొలుచుఫలము
కోటి దానధర్మంబుల మేటి ఫలము
ప్రాప్తమగుచుండు సత్కావ్య పఠనమందు.

33

# ఆనందము

నన్నయ తిక్కనాది కవి
నాధులు మన్ననజేసి నిత్యసం
పన్నత గూర్పగా మధుర
భావములీను తెలుంగు వాణిక
భ్యున్నతి గూర్చినా రలుమ
హోదయు లాంధ్ర కవీంద్ర చంద్రుల
క్కన్నియనా కవిత్వమున
గారవమొప్ప గనుల్ల సిల్లెడిన్।

1

మల్లెలు పూచినట్ల, యెల
మావి చివుళ్ళనుమెక్కి కోకిలల్
మెల్లగ పాడినట్లు, తెలి
మీగడపై కలకండ చక్కెరల్
చల్లి భుజించినట్లు, చల
చల్లని గాలులు వీచినట్లు వి
ద్యుల్లత పూచినట్టులుగ
తోచవలెన్ కవితా కుమారియన్।

2

కలువలు పూయుచుండ, చిరు
గాలులు చల్లగ వీచుచుండ తా
రల ప్రతిబింబముల్ చిరుత
రంగములందున నూగుచుండ, వె
న్నెల విరబూయు చుండకమ
నీయముగా నలలందు రాజహం
సలు తుల దూగు చందమున
సాగవలెన్ కవితా కుమారియున్‌।

3

జలదము నల్లనై మనసు
చల్లగ జల్లులు చల్లినట్లు, పూ
వులబడి నీటి బిందువులు
ముత్యములై తనరారినట్లు, తా
వులు చిరుగాలులం గలిసి
పొవుచు మానవ మానసంబులో
పలగిలి గింతవెట్టు గతి
వర్ధిలగావలె కావ్య కన్యయున్‌।

4

కొదమ గిత్తలు పూన్పసంకోచమింత
లేక, నుత్తేజమొప్ప నల్లేరుపైని
పరువులెత్తెడి మువ్వల బండివోలె
సాగవలె కావ్యకన్య యుత్సాహియగుచు।

5

గంటలును గజ్జెలును ఘల్లుఘల్లనంగ
పొదుగు బరువున మెల్లగా నొదిగి యొదిగి
కనుల విందొనరించుచు కదలివచ్చు.
క మధేనువు కావలె కావ్యకన్య!

౬

అరవిరిసిన పూవులలో
చిరు తరగలలోన, హృదయ సీమలలోనన్
పరువెత్తు మెఱపు సుందరి
దరహాసములోన వెలుగదా కావ్యంబున్!

7

కరకంకణముల గలగల
లురుతరకర తాళములు రసోక్తులు కనకాం
బరములు, మృదు భావంబులు
కరుణాభరణములు కావ్యకన్యామణికిన్

8

తొలకరి జల్లులు తాకిన
పులకించుచు భూమిపొంగి పోయెడిరీతిన్ .
తెలుగుంబలుకుల చలువలు
నలరింపగ వలయు సుహృదయంబుల నెల్లన్

9

నీలి మబ్బులతోడ పందెములువైచి
చల్లచల్లగా చిరుగాలి సాగువేళ
అలరిపింఛము విప్పి నాట్యంబు సలుపు
నెమలి కావలెకృతి కన్య నేర్పుమీర।

10

వట్టిమ్రాకులు తలిరాకు వలువగట్టి
సాగుపిల్లగాలుల సరసాలదేలి
నవనవా భ్యుదయానందశ్రీనాట్యమాడు
కరణి విలసిల్ల వలెనవ్య కావ్యకన్య।

11

చిరుతరంగాల చలువలో సేదదీరి
పూవుపూవున కొక్కొక్క ముద్దు నిడుచు
వలపులూరించు శీతల పవనమట్లు
హాయికూర్పగా వలయు కావ్యంబు సతము।

12

పులిమినకారు చీకటిగ
ముల్ దిగజారగ వెండినీట భూ
లలనను స్నానమార్పి మృదు
లంబగు సొమ్ముల లంకరించితా

వుల నొలికింప జేయగల
పున్నమి చంద్రునికాంతి పోలికన్
సలలిత రాగ మై దశది
శల్ వెలిగింపదె కావ్యకన్యయుకన్।

13

ఇనుడరు దేరగా పరువు
లెత్తెడిగాఢ తమంబురీతిచ
క్కని నవ కావ్యకన్యకను
గాంచిన యంత హృదంతరాన నిం
డిన చిరుచీకటుల్ తొలగి
నిర్మల కాంతులు నిండి సంతసం
బున పులకించి పోవలయు
ఘా ప్రజలెల్ల రుది వ్యదీప్తులన్।

14

తొలియుషః కిరణాల కిలకిల నవ్వుచు
ప్రభవమందెడు బాలభానుడనగ,
పూలబాలల ముద్దుమోములు వీక్షింప
కదలివచ్చెడు పిల్లగాలులనగ,
ఆకాశ గేహినియలరి కొప్పునదాల్చు
పున్నమి వెన్నెల పూవనంగ
బండబారిన నేలపల్లవింపగ జేయు
చల్లని తొలకరి జల్లనంగ,

హాయిగా మానసాబ్జంబులందు నిలిచి
పరవశము కూర్పగల దివ్య భావమనగ
రసిక జన చిత్తముల సుధారస తరంగ
ములను చిలికింపవలె కావ్యములు సతంబు।

15

మాయ మర్మంబు నెఱుగని మానసంబు
వెలుపలికి వచ్చి మోము జాబిలిని వెలుగు
మధుర మందహాసమురీతి మరులుకొల్పి
ధరణి నేలగావలె కవితా కుమారి।

16

సిగ్గులు మొగ్గలై కనులు
చేపలుగా నొక పూలదండతో
బుగ్గలు కందిపోయిపువు
బోడిపదంబులు ఫల్లుఘల్లనన్
దగ్గర జేరి నిల్వ సజల
తారు ముసుంగెడలించినంతనే
గగ్గురు పాటుతో బెదరు
కన్నియ కావలె కావ్యకన్యయున్।

17

అద్దము ముందు నిల్చి తన
యందము చందములెల్ల జూచియు
బ్రొద్దు తీసి తీపి తల
పుల్ పీలపుల్కఁ సెగలొచుకాల్పగా
నిద్దుర రాక నెమ్మదిని
నిండిన కాంతుని రాకకోసమై
ముద్దుబు మూటగట్టు నొక
ముద్దియ కావలె కావ్యకన్యయున్।

18

గజ్జెలు మ్రోయ చన్నుగవ
గంపమునొంద వనాంతరానపూ
సజ్జను వీడిలేనడుము
సారెకు నల్లలలాడుచుండగా
సజ్జన మానసంబు గతి
సాగుచు నూత్న విలాసశోభలన్
ముజ్జగమేలగల్గు నవ
మోహిని కావలె కావ్యకన్యయున్

19

పలుకులు తేనె చిన్కులయి
పాదములన్ మురిపించు కుల్కటం
దెలునవనాదమై చెలగ
నెమ్మదిదో చెడిపోవ భావముల్

వలపులు రేపగా సుజన
వందితమై హృదయాంక పీఠముల్
కొలువుగ నిల్పునట్టి సుమ
కోమలి కావలె కావ్యకన్యయున్।

20

ఎన్నడు చూడరాని హృద
యేశ్వరి చెంతకు జేరి ప్రేమతో
మన్నన చేయురీతి, యను
మాన మొకింతయు లేక సర్వసం
పన్నత గూర్పజాలుభగ
వానుడు దర్శన మిచ్చు రీతిలో
నున్న మనోజ్ఞ భావముల
నూపిరి కావలె కావ్యకన్యయున్

21

బంగరు మేనితోడ, తడ
బాటు లెఱుంగని పల్కుతోడస
న్మంగళ మూర్తియై నిరుప
మానకళా నిలయంబు పోలికన్
ముంగిటిలోన నిల్చియర
యోడ్పు కనుంగవతో రసజ్ఞులు
పొంగగ స్వాగతించు నవ
మోహిని కావ్యకళా వధూటియున్

22

సుందర మందహాస నవ
శోభలనీను ముఖాంబుజంబుపై
నందము చిందులాడకురు
లల్లన గాలికి తేలియాడగా
నందెలు ఘల్లనంగ సర
సాంగి విధంబున చేరవచ్చి పూ
లందుకొనుండటంచువిన
యంబున బల్కెదె కావ్యకన్యయున్।

23

కన్నులు కాంతులై వెలుగ
కాటుక దిద్దిన కారుచీకటుల్
వన్నెలు చిన్నెలొచు నిరు
వంకల నింపు ఘటింపుచుండగా
తిన్నని పూల బాణములు
తేపకు గుండెలలోన గ్రుచ్చి సౌ
ఖ్యోన్నదికూర్పజాలు సర
సోక్తులు వల్కెదె కావ్యకన్యయున్

24

చక్కెరవింటివాని సర
సంబులెఱుంగుట సాధ్యమన్నటుల్
చక్కెర బొమ్మవచ్చి విల
సన్మణి భూషణ భూషితాంగియై

చెక్కిలి చెక్కిలింగలియ
జేయుచు కౌగిట జేర్చినట్లుగా
చక్కని కావ్యకన్య వివ
శత్వముకూర్చును సజ్జనాళికిన్!

25

అరమరలేని కూర్మితర
శాక్షియొకర్తు ప్రసన్నమూర్తియై
కరకమలంబుసాచి నయ
గారము మీరగ ద్రాక్షగుత్తులన్
సురుచిర మందహాసమున
సొంపులు నింపి యొసంగినట్లు సుం
దరమగు నవ్యభావనమ
నంబున నింపదె కావ్యకన్యయున్

26

చారెడు కన్నులు కదలుచు
వీరులనుడి కించుగండు బేడిసలనగా
హారతులిచ్చెడు నాట్యమ
యూరికదా కావ్యకన్యయుర్వీస్థలిపై!

27

కురుల మబ్బుల మాటున కులుకుచుండి
ముద్దు ముద్దుగజూచి దోబూచులాడి
వలపుచూపుల నెమ్మది వెలుగజేయు
కాంతగా నుండవలె నవ్యకావ్యకన్య!

28

పలుకుల నమృతపుజల్లులు
చిలికించి వినూత్న శోభచిందులు వేయన్
వలపించు ముగ్ధమోహన
లలితాంగియ కవిత నవ్యలావణ్యమునన్!

29

రసభావ సంపదలతో
పసివాడని యౌవన ప్రభావంబులతో
సిసలైన వలపు దేనియ
లసదృశముగ చిల్కునతివయగుకావ్యంబున్!

30

పరిశుద్ధమైన చిత్తము
సురుచిరదరహాసవిమల శోభల నతి సుం
దరమైన వదనమొప్పగ
దరిజేరెడు నతివయగు నుదాత్తకవిత్వయున్

31

బంగరు బొంగరంబు లెద
పైనట నంబొనరించుచుండ స
ర్వాంగ విలాసశోభలుక
ళాన్వితమై యలరారు చుండ, క
న్నుంగవగండు చేపలవి
నూత్నవిలాసమువిప్పి చెప్ప, వ
ళ్యంగన దివ్యదీప్తులనొ
యారములొల్కెడె కావ్యకన్యయున్

32

అందెలు సందడింప కురు
లందలి తెల్లని మల్లెపూవులా
నందము చిందిపోవునయ
నంబులతో తెగ నవ్వు చుండ, ము
న్ముందుగ డెందమేనడచి
పోయి పదంబులవెక్క త్రోయగా
కుందుచు జేరవచ్చు సుమ
కోమలికాదె కవిత్వమన్నచో

33

బృందావన మధ్యంబున
నందెలు ఘల్లనగ నాట్యమాడుచులీలన్
ముందుకు సాగెడు రాధిక
చందంబున కావ్యకన్య సాగదె సతమున్

34

పిల్లనగ్రోవి పాట విని
పింఛిన యంతహాస మ్మొకొబ్జయై
యుల్లముపల్లవించిమధు
రోహలకున్ తుదిరూపమిచ్చి ఘల్
ఘల్లను కాలియందియల
కాంతుని కై తనువెల్ల కన్నులై
చల్లగ చేరవచ్చు నభి
సారిక కొవలె కావ్యకన్యయున్॥

35

నడకలు రాజహంసలకు
నాట్యము నేర్పునసంగ తేనెలూ
రెడు మధురోక్తితో వినువ
రించితినేనని తేరిచూచుచున్
పడతు కచేరవచ్చినను
బిల్కుల నెమ్మది తన్పురీతిగా
తడపడకుండ సాగి కవి
తాసతి మోదము కూర్పగావలేన్

36

కెమ్మోవి తీయదేనియ
లిమ్మహిరుచి చూడనట్టి హీనుడుకలడే
ఽ మ్మా॥ వేగమెరసరా
జ్యమ్మున కధినేత పీవెయనవలె కృతియున్

37

తినవేమి వేడినేతిని నన్ను జతజేసి
ముదముతో ననిపల్కఁ మ ద్దపప్పు
ఘమఘుమలాడి నీ కఱవుదీర్చెదనంచు
కనిపించు గుత్తి వంకాయకూర
అడ్డంబు నీకేల వడ్డించుకొని నన్ను
కలుపుమాయని పల్కఁ గడ్డపెరుగు,
చప్పరించుము నాల్కఁ ద్రుప్పుడుల్చెదనింక
నాలస్య మేమను నావకాయ,

అన్నిరుచులు సాదరాహ్వాన మునుపల్కఁ
వేచి చూచుపెండ్లి విందువోలె
తనివి తీర్పవలె సుధారసధారల
కమృతావినింపి కావ్యకన్య!

౩౮

చెఱకు వింటివాని చెఱఁబాపఁగా నాదు
విందు కప్పురంపు విడియమిదియ
స్వీకరించి ప్రణయ జీవనసామ్రాజ్య
మేలుమనెడి కవిత మేలుకొలుపు!

# ఉపదేశము

ఒకనాడు వేద మతోద్ధరణమునకు
కవితాకుమారి స్వాగతము పల్కె,
ఒకనాడు పిచ్చిమదోన్మాదమును బాప
కవితా వధూటి యుకదను|ద్రొక్కె,
ఒకనాడు శృంగారముదయింపగాగోరి
నవకవితా కన్యనాట్యమాడె,
ఒకనాడు నానందముపదేశముల నీయ
గాకావ్యకన్య నిక్కముగ నిలిచె

దేశకాలములను దృష్టిలోనిడుకొని
కావ్యకన్య పెక్కుగతులదనరె
నేయుగా నన్నైన యేకాలమందైన
నది "జగద్ధితంబు" నై వెలింగె।



కాలము మారిపోయినది
కావ్యము యొక్క ప్రయోజకత్వసూ
త్రాలును మారిపోవలె, స్వ
రాజ్యరథంబు పురోగమించు పం

ధ లను తీర్చిదిద్దు సమ
తామమతల్ విరబూయు నవ్యకా
వ్యాలు రచింపగావలె మ
హాకవులెల్లరు దీక్షబూనుచున్

2

మనసానందము పొందుకోసరము, సా
మాన్య ప్రజానీక మం
దున విజ్ఞానము నింపుకోసరము చిం
దుల్ వైచెనాకాల మం
దున సత్కావ్యము; వర్తమానమున నెం
దున్ శాంతి లేనట్టి వా
రిని నోదార్చుచు కావ్యకన్యయె కదా
రింజూపగా నౌనిలన్‌।

3

సమతా భావము సాధువర్తనము తీ
క్షాదక్షతన్, నిత్య స
త్యము విశ్వాసము, నాత్మగౌరవమును
త్సాహంబు దీపింపను
త్తమ మార్గంబున సర్వమానవుల కం
దంబొప్పబోధించి, చి
త్తములందెప్పుడు నిల్చిపోయెడునుదా
త్తంబౌచు సత్కావ్యమున్।

4

ధనమె సమ_స్తమంచు పెడ
దారులు త్రొక్కుచు తోడివారిఁజీ,
వనమును దొంగిలించి, ధన
వంతులుగా ధరలోన నిల్చి పే
దమ గని చీదరించుకొని
దర్పము చూపెడివారి మానసం
బున కరుణా స్రవంతులను
పుట్టగ జేయవలెన్ కవిత్వమున్।

5

ప్రేమ యొకండె దైవమని
పెద్దలు చెప్పిరి, సర్వజీవులన్
ప్రేమను గౌరవింపగల
విజ్ఞుడె భక్తుడు। ప్రేమలేక యిం
కేమి యొనర్చినన్ భజన
లెంతగ జేసిన నీశ్వరేశ్వరుం
డా మొరనాల కింపడు గ
దా। యని తెల్పవలెన్ కవిత్వమున్।

6

5)

కారు చీకటిలో దారి కానరాక
కుములుచున్నట్టి మానవకోటికెల్ల
సొంపులీనెడు వేగురు చుక్కవోలె
కాంతి వెదజల్లవలె నవ్యకావ్య కన్య!

7

సమతావాదమె వేదమై జగతి ర
క్షా కంకణంబూని. వా
క్యములానందర సాధి దేవతకు ని
క్కంబైన వాసంబుగా
విమలాంతః కరణంబుతో ప్రజలు జీ
వింపంగ సన్మార్గమున్
క్రమముందప్పక బోధ సల్పవలె స
త్కావ్యంబు లిద్ధారుణిన్!

8

కాబోలునిది! లోకకళ్యాణ కాంక్షను
చాటింపగలరాజ శాసనంబు,
కాబోలునిది! యంధకారబంధురమైన
జగతిని వెలిగించు చంద్రరేఖ!

ఉ ప దే శ ము

కాబోలునిది! యహంకారుల గుండెల
మానవతను నింపు మంత్రశక్తి,
కాబోలునిది! సర్వకాలంబు లందును
నవజీవమగు రసానందలక్ష్మి!

యనుచు విజ్ఞానులెల్ల సమాదరింప
సర్వ పండితా మోదమై జగతినిల్చి
మమత సమతానురాగ సంపదలు నింపి
ధరణి నేలగావలె కవితాకుమారి!

9

ఆకలి మంటచే బ్రతుకు
టంగడిలో వ్యాకయాట బొమ్మయై
కాకలమూక చిత్తమున
గాయము రేపగ, పొంగివచ్చు నా
శోకము కంఠమందదిమి
సుందరమౌ దరహాస చంద్రికల్
నీకును, నీ కొసంగు తరు
ణింగరు నింపదె కావ్యకన్యయున్!

10

గడపదాటని యుక్కు పిడికిళ్ల లానాడు
కన్యల మానభంగంబు నేడు!
విద్యలు వలదను వేదాంత మానాడు
కట్నాలకొఱకు ధిక్కారమిపుడు!
సహగమనపు దురాచారంబు లానాడు
సతుల జంపెడు సదాచారమిపుడు!
బాల్య వివాహ సంబంధంబులానాడు
బాకులై నిలుచు విడాకులిపుడు!

ఎన్ని యుగములు గడిచిన యెందరెన్ని
సంఘ సంస్కరణంబులు సలిపియున్న
నిలిచిపోనట్టి సతుల కన్నీటి వరద
లాపి రక్షింపవలయు కావ్యంబు నేడు!

11

ఆచారంబుల పేరిట
నీచపు పనులెన్ని యైన నెరపుచు నెపుడున్
వాచాలత్వము చూపెడి
బూచుల నెదిరించి కవిత పోరాడవలెన్.

12

కట్నంబు లేనిదే కన్యను వరించు
టాచార మెట్లగు ననెడి వారు,
విందు లేకయ పెండ్లి వేడ్కలు చేయుట
ఆచార మెట్లగు ననెడి వారు,
కులము కానట్టి కన్యలను వరించుట
ఆచార మెట్లగు ననెడివారు,
ధనము లేనట్టివారిని పెండ్లి యాడుట
ఆచార మెట్లగు ననెడివారు.

మతము పేరిట ప్రేమను మంటగలిపి
మనుజ జన్మకు మాలిన్యమును పులుముచు
బ్రతుకు వారికి సమతా స్వభావములను
కలుగ జేయగావలె నవ్య కావ్యకన్య!

13

తన కన్నతల్లి మోమునుగాంచి తరియించు
భాగ్యంబు నోచని పాల పాప.
తన కుక్షినిండ పాలను గ్రోలి యానంద
మును పొందజాలని ముద్దుపాప,
తన దేహమును కాచుకొనుటకు నూలు వ
స్త్రము పొందలేనట్టి చంటిపాప,
తన ఈడువారి చెంతకు జేరి సంతృప్తి
చెందగా లేనట్టి చిన్నిపాప,

లెందరెందరు కన్నీరు చిందులాడ
గుండెలవియగా రోదించు చుండినారొ
వారి గాఢాంధకారపు బ్రతుకులందు
చలువ వెన్నెల కురియింపవలయు కవిత!

14

దారిద్ర్యంబున జన్మమంది పలు నిం
దల్ మోసి జీవించుచున్
శారీరేచ్ఛలు మానసానగల వాం
ఛల్ నీరసంబౌచు, నే
దాగింగానక దుఃఖరార్ని ధులలో
తారాడుచున్నట్టి సం
సారుల్ సంతస మొందజాలు నవతే
జంబౌను సత్కావ్యమున్!

15

శ్రీ గల వారలు పేదల
నీగలుగా తీసి వేయుటిద్దరనికె పై
సాగక రాదని ధేరిని
ప్రోగింపవలెన్ కవిత్వమును దీక్షమెయిన్

16

తోఁచి మానవులను ప్రేమతోడ జూడ
లేనివారలు, చూడగా రాని దేవు
నెపుడు ప్రేమింపలేరుఁమహీతలాన
ననుచు దెలుపగా వలయు కావ్యంబులెపుడు

17

బలహీనుండని, దిక్కులేదనియు దౌ
ర్భాగ్యుండటం చెందరో
కలవారల్ గుమికూడి పేదనొకకు
క్కుంజంపు చందంబుగా
బలవంతమున బాకులం బొడిచి చం
పన్, వానిశ్శిర క్తంబు భూ
తలమున్ కంపిలజేయునంచెపుడు స
త్కావ్యంబు బోధింపనౌ॥

18

సాగుచున్నది॥ యహింసా మూర్తులకు నివా
సంబైనచోట, హింసా ప్రవృత్తి॥
నిలుచుచున్నది॥ మహాత్ముల త్యాగ ఫలముగా
నలరారుచోట స్వార్థాశయంబు॥
చెలగుచున్నది॥ కళాశ్రీ వెలింగినచోట
కోరల నూరుచు కుల పిశాచి॥
ప్రబలుచున్నది॥ రత్నరాసులమ్మిచోట
దరిలేని దారిద్ర్య దహనకీల॥

స్వర్గతుల్యమైన స్వాతంత్ర్య సీమలో
భావ దాస్యమిపుడు పాదుకొనియె
హేయమైనట్టి యీ స్థితిం దొలగించి
కావ వలయు నవ్యకావ్య కన!

19

గగన తలంబులో నరుడు
గంతులుపైచి ఖగోళ శాస్త్ర మం
ద గణిత శక్తి యుక్తిసము
పార్జన చేసెడి కాలమందు సి
గ్గగు నను పుట్టరాదనుచు
నాంక్ష విధించెడు వారి జూడ, నిం
పగ సమతా స్వభావమును
పొందొనరింపవలెన్ కవిత్వమున్!

20

కులములతోడ మానవత
కున్ తలపంపులు తెచ్చిపెట్టి దీ
నులకు, నభాగ్య జీవులకు
నోటికి కళ్ళెమువైచియూరి కా
వలనొక మూలనుంచి పలు
బాధలు కూర్చిన పిల్లియైన బె
బ్బులి యగునన్న సూత్రమును
బోధ యొనర్పవలెన్ కవిత్వమున్.

21

ఎంతటి గొప్ప వాడయిన
నెంతటి సత్కవితా విభూషణుం
డెంతటి పండితుండయిన
హీనకులంబున జన్మ మందినన్
వింతగజూచి, వానినొక
వెఱ్ఱి మొగంబుగ లెక్కవైచుట
త్యంత ప్రమాద హేతువగు
నంచిల సత్కృతి తెల్పగావలెన్!

22

కులమును కోరకే కుసుమ
కోమలి సత్కవితా వధూటి తా
వలచి, వరించి, సత్కృతుల
భంగుర లీలను గూర్చునట్టి ధీ
విలసితు జేయగా నతని
విద్యకు భ్రష్టకులాల పేరుతో
కలుషము పూయుటద్దిసరి
కాదని తెల్పవలెన్ కవిత్వమున్:

23

ఒక గ్రామమునకు నింకొక గ్రామమునకున్న
యంతరం బెల్లను నంతమాయె:
నొక దేశమునకు నింకొక దేశమునకున్న
మధ్య దూరంబెల్ల మాయమాయె:
నొక ఖండమునకు నింకొక ఖండమునకున్న
సరిహద్దులెల్లను సమసిపోయె:
నొక గోళమునకు నింకొక గోళమునకున్న
సూన్య ప్రదేశంబు సూన్యమాయె:

చిత్రముగ కంచెలెల్లను చెదరిపోయి
ఇరుగు పొరుగుగా జీవించు నీయుగాన
కులము మతమని వాదించుకొనుట సిగ్గు
కరమనుచు దెల్పవలె నవ్య కావ్యకన్య:

24

కులము పిశాచి దాసులుగా మెలంగెడు
పిసినారి తాతలు మసలు చుండ,
మతముఃందిచ్చెడు మత్తు మందులలోన
మతిపోయినట్టి దుర్మనుజులుండ,

వర్గంబుపేర సర్వస్వంబు భక్షించు
పంది మాగడులు పెంపొందుచుండ,
ధనమన్నదే నిత్య ధర్మంబుగా నెంచు
కలియుగ విదురులు మెలగుచుండ,

సహిత, మమతాను రాగాలు జగతి నిల్పి
నవ సమాజము సృష్టి యొనర్చు పనులు
గగన కుసుమాలటంచు నిక్కముగ ప్రజకు
కనులగట్టగా వలె నవ్య కావ్యకన్య।

25

కులమన్న పదము బిడ్డల మనోఫలకాల
నిలుపని విద్యను నేర్పగలిగి,
మతమన్న దెవ్వరిమ్మహిలోననెన్నడు
తలపని మానవత్వంబు నేర్పి,
తెగయన్న దెన్నడే దిక్కున కనరాని
సోదర భావంబు పాదుకొల్పి,
వర్గంబనెడు మాట వసుధా స్థలంబులో
కనరాని రీతి సత్కరుణ నింపి,

బడుగు పేదయైన భాగ్యవంతుండైన
పిన్నయైన యుద్ధ వీరుడైన
నెల్లజనులనిలను నేకోదరులమాడ్కి
కలుపవలయు నవ్యకావ్యకన్య
26

తల్లిదండ్రుల కన్న దైవంబు లేదను
పూజ్య భావము మనంబులను నిల్పి
మానవసేవయే మాధవసేవగా
భావింపగలుగు తత్త్వంబునింపి,
నినువలె తోడి, వారిని చూడవలెనను
సమతాస్వభావంబు సంతరించి,
కలిమి లేములు రెండు కావడి కుండలే
యనెడు సత్యంబునిత్యంబు తెలిపి,

పిరికితనము లేని భేదంబు కనరాని
మధుర భావములను మదులయందు
నిల్పి, నవయుగంబు నిర్మింపగలదన్న
ఘనత నిలుపవలయు కావ్యకన్య।
27

గాలిని మూటలు కట్టుచు జీవించు
గారడీ మాటలుక సరికొట్టి,
నీటిపై వ్రాతలు నిజమని నమ్మించు
దొంగధర్మాలను తొలగద్రోచి,
భస్మశాశిని పోయుపన్నీరు విధముగా
కాలంబుగడు పుటకట్టి పెట్టి,
ఆకాశ కుసుమంబులవె కోసికొమ్మను
కోతిచేష్టకు వీడుకోలు చెప్పి,

వైన్యకరమైన సోమరితనము వీడి
సర్వమానవులకు నిరీక్షణ నొసంగి
చిత్తశుద్ధితో మానవసేవచేయ
నేర్పవలె కావ్యములు ధారుణీస్థలాన.

28

జననియు జన్మభూమియును
స్వర్గముకన్నను మిన్నలంచువా
కొనుటయెకాదు, కార్యములం
కున్ వెనుదీయక దేశమన్నచో

మనుజులె, మట్టి కాదనుచు
మానవసేవ యొనర్చుటన్నదే
ఘనమని తెల్పగా వలయు
కావ్యము ల్ధరనెల్లకాలమున్!

29

హింసయేనాడు సత్ఫలమీయ దనుచు
విశ్వమానవ ప్రేమ దిగ్విజయమునకు
మూలమని సర్వజగతికి బోధసల్పి
ఘనయశము కాంచవలయు సత్కావ్యకన్య

30

చవులూరుచుండు నాసాహితీలతలెల్ల
కృష్ణరాయల కళాకేళిలోన!
తనరారుచుండు నాధర్మ వీరంబుల
గ్గాండరు గుండెల గాలమగుచు!
అలరించు నాదుగానామృత ధారలు
త్యాగయ్య గొంతులో రాగమొలికి,
మురిపించు విశ్వసమ్మోహనమగు నాదు
భరత నాట్యము భావభరితమగుచు,

లలిత కళలకు శిక్షణాలయము వీర
యోధులకు పుట్టినిల్లు, మహోజ్జ్వలమగు
భక్తి విజ్ఞానముల కుగ్గుపాలు వోయు
భద్రగుణ సముపేత! నా భరతమాత!

31

అతులిత దీక్ష బూనినమ
హా కవులెందరొ సత్యవాక్య భా
షితమగు కావ్య రాజములు
సృష్టియొనర్చిరి, భావి పౌరజీ
వితమును తీర్చిదిద్దెడు వి
వేకములేక యె పూర్వకావ్యముల్
కతలని త్రోసివేయ సరి
కాదని తెల్పవలెన్ కవిత్వమున్!

32

మందిర నిర్మాణంబున
ముందుగ దృఢమగు పునాది ముఖ్యంబగు, కా
వ్యేందిర నిర్మాణంబున
ముందగ సత్కావ్య పఠనముఖ్యంబుగుతన్,

33

అల కవిత్రయమువారల నేర్పునెఱుగక
సత్కావ్య రచనంబు సలుపనగునె?
సహజ పాండిత్యుని శయ్యావిలాసంబు
లరయక కావ్యంబులల్ల గలరె?
ఆంధ్ర నైషధకర్త యడుగు జాడలలోన
నడువక కావ్యంబు నడుపగలరె?
అలసాని పెద్దన్న యల్లిక జిగిబిగి
తెలియక కావ్యంబు నిలుపగలరె?

"చేమకూర" ను విడిచిన శ్లేషకలదె
రామలింగని తెలియక రక్తి కలదె
పూర్వ కవులను మఱచిన ముక్తి కలదె
ధరపునాదులు లేక సౌధములు కలవె?

34

పంచమ వేదామృతమును
పంచిన కవి వరుల భావవైశాల్యంబూ
హించక కావ్యంబులు వెల
యించుట దుష్కరము భూమి నెవ్వరికేనిన్

35

మందార మకరంద మాధుర్య మందిచ్చి
భక్తులదనిపెడి భావ పటిమ,
నిర్మల మందాకినీ వీచికల దూగు
రాయంచనడకల రాజసంబు

పూర్ణేందు చంద్రికల్ పూయించి హృదయాల
వెలిగింపగల మహోజ్జ్వల తపస్సు,
లలితరసాల పల్లవ ఖాదియై మించు
కోకిల గొంతులో కులుకు పలుకు,

పరవశము కూర్పగల దివ్య భావములను
సరస సంగీత మయముగా సంతరించి
సదయ హృదయాల నిత్యవాసంబు సేయు
సహజ పాండిత్యనకు నమస్కారమనరె!

36

పాండిత్య గరిమకు బద్ధలై పోయెను
గౌడడిండిమభట్టు కంచుఢక్క,
కనకాభిషేకంబు కాంచి తరించెను
దక్షిణాధీశు ముత్యాల శాల!
కవి సార్వభౌముని గౌరవంబుగ నిల్పె
హర్ష నైషధ కావ్యమాంధ్రభాష
ఆంధ్రభారతి కంఠహారంబులై వెల్గె
రమణీయ సీస పద్యములగములు!

దివిజకవివరు గుండియల్ దిగ్గుననగ
నమరపురి జేరినట్టి మహాకవీంద్రు
సత్కవిత్వామృతంబాను శక్తిలేక
కావ్యరచనంబు కావింపగలరెభువిని!

37

కీరవాణులమేను గిలిగింతలొనరించు
నట్టి చూపులు రెప్పలందు దాచి,
ఆననాబ్జము నందుననలెత్తు చిరునవ్వు
చిందిపోవకమున్నె డిందుపఱచి,
బంగారు జిగి మేని శృంగార చేష్టలు
కనిపింపనీక మౌగ్ధ్యమునడాచి,
పరమై యానంద భరితమౌ నరోక్తి
యుబికి నాలుకకు రాకుండ గ్రుక్కి

ప్రవరునే మించుక పటుప్రవరుని చేష్ట
లెందు వనజాక్షి కెఱుక రానీయకుండ
మలచి నిలిపిన జిగిబిగి మెఱచిరేని
కావ్యములు వెలయింప శక్యంబెభువిని?

38

"తృవ్వటబాజా" తలపై
పువ్వులు పూయించి, నవ్వు పట్టించుచుతా
నొవ్వక భువన విజయమున
కవ్వడి యగు రామకృష్ణ కవిని తలపరే।

39

ప్రతి పదములో చమత్కృతి
యతులిత ప్రతిభావిశేషమలరారంగా
కృతులల్లు "చేమకూర" సు
కృతి రచనలు చదువకున్న కృతులల్లుదురే?

40

పూర్వాంధ్రకవుల రచనలు
గర్వంబును వీడి చదువగలిగిన నాడీ
యుర్వీస్థలి సత్కావ్యము
లార్వా చీనులు రచింతురత్యాసక్తిన్

41

ప్రాతయంతరోత, నూతనంబైనదే
ప్రగతి యంచు దలపవలవదంచు
ప్రాతక్రొత్తలందు పరికింపగా మంచి
కలదటంచు దెలుపవలయు కృతులు।

42